# ఈనాటకమునందువచ్చు పాత్రములు.

## పురుషులు.

దశరథుఁడు—కోసలదేశాధిపతి.

| | | |
|---|---|---|
| రాముఁడు— | } | దశరథపుత్రులు. |
| లక్ష్మణుఁడు— | | |
| విశ్వామిత్రుఁడు— | } | మునులు |
| వశిష్ఠుఁడు— | | |

నారాయణుఁడు—విశ్వామిత్రశిష్యుఁడు.

శతానందుఁడు—జనకుని పురోహితుఁడు.

శంకరుఁడు—వశిష్ఠశిష్యుఁడు.

జనకుఁడు—మిథిలానగరాధినాథుఁడు.

శతానందుఁడు—జనకునిపురోహితుఁడు.

## స్త్రీలు.

| | | |
|---|---|---|
| కౌసల్య— | } | దశరథునిభార్యలు. |
| సుమిత్ర— | | |
| కైక— | | |

కావేరి—కౌసల్యదాసి.

రుచిర—కైకదాసి

తాటక—రాక్షసాంగన.

సీత—రామునిసతి.

మృదుల—సీత చెలిమికత్తె.

శ్రీ

# కల్యాణరాఘవము.

## ప్రస్తావన.

### నాంది.

మ. నవనీతోపమకాయుఁడై బుధుతఁడై ♦ న, న్నాఁరి శౌర్యంబుతో
నవనంబున్న లవేర్చి, గాధిసుతుని ♦ స్సంతుష్టుఁగావించి, శం
భువుచాపంబవలీలఁద్రుంచి, సిరియా ♦ భూపుత్త్రిఁగొన్నట్టి, రా
ఘవరాముండను, దయాబ్ధిమీకొసఁగుత ♦ న్గల్యాణముల్నిత్యముః

(నాంద్యంతమున సూత్రధారుఁడు తెఱవంకఁజూచి)

సూత్ర—నటీ ! ఇటొకసారిరమ్ము.

(ప్రవేశించిన నటింజూచి)

ప్రేయసీ ! పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు పండ్రెండవ నాట
మొకటి క్రొత్తగా వ్రాసినారు. తత్ప్రదర్శనకార్యమందు నీవునాః
సహాయురాలవగుదువను నాశతో నిన్నిప్పుడు పిలిచితిని.

నటి—అసహాయశూరులకు సాహాయ్యము నిమిత్తమాత్ర
మైనను నాయందలిదయచే, గౌరవముచేనన్నుఁదోడ్పడుమంటిరి. కా
యానాటకమేదో సెలవిచ్చెదరా ?

శ్రీ

# కల్యాణరాఘవము.

## ప్రస్తావన.

### నాంది.

మ. నవనీతోపమకాయుఁడై బుధనుతుఁడై ♦ న, న్నూర్వి శౌర్యంబుతో
సవనంబున్నెఱవేర్చి, గాధిసుతుని ♦ న్సంతుష్టుఁగావించి, శం
భువుచాపంబవలీలఁద్రుంచి, సిరియౌ ♦ భూపుత్త్రిఁగొన్నట్టి, ర
ఘువరాముండు, దయాబ్ధిమీకొసఁగుత ♦ న్గల్యాణముల్నిత్యముల్

(నాంద్యంతమున సూత్రధారుఁడు తెఱవంకఁజూచి)

సూత్ర—నటీ ! ఇటొకసారి రమ్ము.

(ప్రవేశించిన నటిం జూచి)

ప్రేయసీ ! పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు పండ్రెండవ నాట మొకటి క్రొత్తగా వ్రాసినారు. తత్ప్రదర్శనకార్యమందు నీవు నాకు సహాయురాలవగుదువను నాశతో నిన్నిప్పుడు పిలిచితిని.

నటి—అసహాయశూరులకు సాహాయ్యము నిమిత్తమాత్రమైనను నాయందలిదయచే, గౌరవముచేసన్నుఁ దోడ్పడుమంటిరి. కా, యానాటకమేదో సెలవిచ్చెదరా ?

చుటకదా తృప్తి! అట్టిభావనాజన్య మహానందప్రవాహంబున నోలాడ్చునాటకముగాన "సర్వశుభప్రద" మంటిరి కాంబోలు.

సూ—ఓ! గడుసుదానా! నన్నెక్కడనుండి యెక్కడకీడ్చుకొనిపోవుచుంటివి! పావనగ్రంథసంభాషణము భావజానందములో విరమింపఁజేసితివే! నీవే నన్ను జయించితివి. పోనిమ్ము. ఈప్రపంచమందాఁడు వారి కోడనివా రెవరు?

సీ. కూ్రరనారాచవితతికి, ♦ ఘోరకదన
రవములకు, జంకనట్టివీ ♦ రపురుషుఁడును,
గలికికొ్రవ్వాఁడిచూపుఁదూ ♦ పులకు, జిలుక
పలుకులకుఁసోలిదాసుఁడై ♦ పడునుగాదె!

నటి—మీరుమాత్రము మాడువారుకారా? కల్లమీనములతోఁ గత్తికత్తులతో నాడువారాఁడువారికోడిరి. దానికేమిగాని, యాశృంగారప్రసంగమింతటితోఁ గట్టిపెట్టి, కథానాయకుఁడును బతితపావనుండు నగు శ్రీరామచంద్రమూర్తింగూర్చి యొకింత చెప్పఁ; డదివిని నాటకప్రదర్శనమునకుఁ బోయెదను.

సూత్ర—ప్రియురాలా! మంచిత్రోవకు వచ్చితివి. శ్రీరామమహిమ యడుగుటకుం జెప్పుటకుఁగూడఁ దగినది. కానిపూర్ణముగఁ దృప్తికరముగ వర్ణింప నా కశక్యము.

సీ. అవనిరక్షింపదయతోడ ♦ నవతరించి
నట్టియానచ్చిదానంద ♦ మైనతండ్రి,
రామచంద్రుఁడుమనయంత ♦ రంగములకు
లొంగని యమేయుఁడెట్లు వ ♦ ర్ణకులకులొంగు!

గీ. కానిపూర్వపుణ్య ♦ కర్మ ఫలంబున
ననుభవింపఁ గలిగి ♦ రామహాత్మ
పైనిగల్గు భక్తి ♦ వలన జనించిన
యమృతమంజనా సు ♦ తాదు, లింతి !

సఖియు, నాబహిఃప్రాణమా ! ఒక రహస్యముఁ జెప్పెద వినుము.

సీ. జనకాది బంధు నా ♦ శనవిపన్మగ్నులై
దిక్కులే కేడ్చెడు ♦ దీనులకును
బట్టినదెల్లను ♦ భస్మమైపోయెడు
భగ్నసంకల్ప ని ♦ ర్భాగ్యులకును,
వచియింపరాని దు ♦ ష్పాతకంబులుసల్పి
కుళ్ళికుళ్ళి తపించు ♦ కుజనులకును
జదివినకొలఁదిని ♦ సందేహచిత్తులై
యూఁగులాడు విపశ్చి ♦ దుద్ఘములకుఁ
ఆవె, నట్టియిట్టివారి ♦ కననేల? నానా, భ
వార్తులైనవారి, ♦ కమృతసౌఖ్య
కాము లెల్లరకును ♦ గనరాంగి! గట్టిగా
నమ్ము! దిక్కు రామ ♦ నామమొకటె ॥

స—ఔను, నాథా ! ఈయన రామాయణ నాటకములోను
చోనాకుఁ గాయకష్టములుగూడ నగపడుట లేదు.

సూత్రి—ప్రియురాలా ! అదియొక వింతగాదు.

గీ. మనసునకు దేహంబునకు స ♦ బంధమున్న
యంతదాఁక నెతను బాధ ♦ లంటు నరుల ;
భక్తిభరితాత్మ తనువును ♦ బాసియెపుడు
వేఁడునో, తనుబాధలు ♦ వీడునపుడె.

నటి—ఆహా! ప్రాణేశా ? ఈ రామాయణనాటకము ఉభయ తారకములుగదా !

సూత్రి—నిన్నును నన్నే కాదు. లేఖకపాఠకద్రష్ట ప్రదర్శకాదులనందఱుఁ దరింపఁజేయు సమర్థములు.

నటి—నిజముగా నే నెంతో ధన్యురాలను.

గీ. దశరథుఁడాత్మ లేం బ్రాండు ♦ తనసతులకుఁ
దెచ్చిపాయస మర్మిలి ♦ నిచ్చినట్లు
నాకుఁ గరుణించి యిడితిరి ♦ నాథ! యిపుడు
పరమపావనమౌ రామ ♦ భక్తిసుధను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

శ్రీ

# కల్యాణరాఘవము.

## ప్రథమాంకము.

(ప్రవేశము— దశరథుఁడు, కౌసల్య, సుమిత్ర, కైక.)

దశ—సతులారా! ఋశ్యశృంగునార్త్విజ్యమునఁ జేసినజన్నము దైవ కటాక్షమునఁబూర్తియయినది. ఇదిగో పాయసము. యజ్ఞదేవ దత్త ప్రసాదము. దీనిని మీరు భుజియించి గర్భముల ధరింపుఁడు.

కౌ—మేమంతఱము మడుఁగుబట్టలధరించి శుచిగ నున్నారము. తామే మాకొసఁగుఁడు. భుజింతుము.

దశ—కౌసల్యా! ఈపాయసమున నీకెంత కావలయును?

కైక—ఏమైన మధురపదార్థ మితరులకుఁ బంచియిచ్చుచో ముందుగాఁ జిన్నవారిముచ్చటఁ దీఱుట మంచిపని కావున నాథా! మీరు మాయక్కగారి నొనర్చినప్రశ్నమును నన్నె యొనర్చిన యెడల నంతకంటె బాగుగ నుండునేమో?

దశ—కైకా! కేవల రుచిప్రధానమై కడుపు నిండించుకొనుటకుమాత్రమే పనికివచ్చు నైహిక పదార్థమునుబంచిపెట్టునపుడు నీవనినట్లు చేయవచ్చునేమోకాని దైవప్రసాదితమగునీపవిత్రవస్తువును గూర్చి నీవు చెప్పినయేర్పాటు పనికిరాదేమో!

కై——దైవప్రసాదమునకందఱును సమానార్హులే కదా! అట్టిచోఁ హెచ్చుదిన్న భేదమేల చేయవలయును? కావున ముగ్గురకును సమానభాగముగఁ బంచిపెట్టుము.

సు——చెల్లెలా! వారి యిష్టానుసారము వారే యాచరింతురు. నీబోధనమేల?

కై——నేను నీకేమియు బోధింపలేదు. నీవు నన్ను మందలింపవలసినపని లేదు.

కౌ——(అపవారించి సుమిత్రతో) చెల్లెలా! నీవూరకుండుము. మనకు భర్తతోఁగాని చెల్లెలితోఁగాని వాదమెందులకు? ఏదైవకటాక్షమునఁ బాయసపాత్రము నాథునకు లభించినదో యాదైవకటాక్షముచేతనే యది మనముగ్గురకు దైవము విధించిన యేర్పాటు ననుసరించియే సిద్ధించును.

సు——(అపవారించి, కౌసల్యతో) అందరకంటె భర్తకధికానురాగాస్పదము ననికాఁబోలు నీతివాక్యబోధనమారంభించినది.

కౌ——(అపవారించి సుమిత్రతో) భర్తయుండఁగల చనవున నామె యేమయినఁ బల్కినచో మన మన్యథా యెంచఁదగదు.

కై——నాథా! ఊరకుంటిరేల? ముగ్గురకు మూఁడుసమభాగములుచేసి యిచ్చుటయే న్యాయముకాదని తోఁచినదా యేమి?

దశ——కైకా! అట్లు తోఁచినఁ దప్పుగాదని తోఁచుచున్నది.

కైక——అటులైన నాకందరకంటె దక్కువ నిచ్చెదవా?

సు——చెల్లెలా! ఈపాయసముతో నాఁకలి దీర్చుకొనఁదలఁచితివా? ఇది దైవదత్తమగు పదార్థము. కొంచెము భుజించిననేమి? విశేషముగ భుజించిననేమి? గంగోదకము సాలగ్రామతీర్థముఁ ద్రాగినఫల మొకయుద్ధరిణెఁడుతీర్థము ద్రాగిన ఫలముకంటె నెక్కుడగునా?

కౌ—(అపవారించి) చెల్లా! అడుగనిదే నీవేల మాటలాడె దవు?

కై—అక్కా! మీరిద్దఱు జ్యేష్ఠదేవులు. మీకు పెద్దనంతులు వచ్చునుగదా యను ధైర్యముతో నన్నుశ్రీరంగనీతులయిన జెప్పఁ గలరు. నేను గనీయసురాలను. కనిష్ఠురాలను. అధమురాలను. నీచురాలను. పాపాత్మురాలను. మీరిద్దఱు గారగింపఁగా నేదయిన నొక్కయుచ్ఛిష్టబిందువుమిగిలిన నది మీయిష్టప్రసాదమని యెంచి కన్నుల కద్దుకొని తినవలసినదానను.

దశ—కైకేయీ! ఎందులకీకోపము? చూడుము. (చేయి పట్టుకొని) నేనుఁ జెప్పినమాట వినుము.

కైక—ఒక్క నీవు చెప్పినమాటల వినుటయే కాదు నాబ్రదుకు తెల్లవారునా? ఈయక్కగారు చెప్పినమాట వినవలయును. ఆయక్కగారు చెప్పినమాట వినవలయును. కనిష్ఠురాలనై నీయింటఁ బ్రవేశించిన దోషమునకు నాకే చిన్నతనము తప్పునా? అనురాగములలోఁ జిన్నతనము. ఆదరణములలోఁ జిన్నతనము. ముచ్చటలలోఁ జిన్నతనము. ముసుపులలోఁ జిన్నతనము. మాటలలోఁ జిన్నతనము. మర్యాదలలోఁ జిన్నతనము. బ్రదుకఁతలోఁ గూడఁ జిన్నతనము. పరములోఁ గూడఁ జిన్నతనము.

సుమి—(తనలో) కానిచూ అచు అచూపులలోఁ బెద్దతనము, సూడు మాటలలోఁ బెద్దతనము. బుడిబుడియేడుపులలోఁ బెద్దతనము. బూకరింపులలోఁ బెద్దతనము. గయ్యాళితనములలోఁ బెద్దతనము. గడుసుదనములలోఁ బెద్దతనము. కొంటెమాటలలోఁ బెద్దతనము. కాటులాటలలోఁ బెద్దతనము.

దశ—(అపవారించి) కౌసల్యా! నీకెంతవంతు కావలయునని యడిగితిని. చెప్పనైతివేమి?

కౌ—(అపవారించి) మా చెల్లెలు కైకేయి కోరినంతవఱ నామెకిచ్చి మిగులుదానిలో మీకుఁ దోచినంత నాకుఁ గటాక్షింపుఁ

కై—అక్కా! నాకు వంతు నీయవలదని భర్తతో రహస్యముగఁ జెప్పుచున్నావా?

కౌ—చెల్లెలా! నీకే పెద్దభాగము నీయవలసినదని చెప్పుచున్నాను.

కై—నాకంత యాస లేదమ్మా! నాకట్టిపేరాస లేదమ్మా! నాకట్టిదురాశ లేదమ్మా! పెద్దవారైన మీకే పెద్దపెద్దయాశలుండుఁగాని—

సు—చెల్లెలా! ఎందులకు నమ్ము నిందింతువు? భాగములఁ గూర్చి భర్తగారితో మేమేమైనఁ బ్రస్తావించితిమా? పెద్దవంతులని చిన్నవంతులని సమభాగములని లేనిపోని రాద్ధాంత పూర్వపక్షముల నీవే చేయుచున్నావు కదా! మేమేమైన మాటలాడితిమా?

కై—అబ్బో! మీరు సంగనాచులు. నాలిముచ్చులు. చీమలు. సన్నసన్న సన్నాయినొక్కుల జాణలు. నన్ను భగవంతుఁడు పెద్దగొంతు, పెద్దకడుపు, పెద్దయాశతో సృష్టించినాఁడు. పాత్రలోని పరమాన్నమునంతయు నేనే భక్షింపవలయునని యేడ్చుచుననుకొంటిరేమో! నాకేమియు నక్కఱ లేదు. మీరిద్దరే భుజింపుఁడు. మీరిద్దరే పుత్త్రులఁ గనుఁడు నాథా! నేను బోవుదును.

(పోఁబోవును.)

దశ—(ఉస్సురనుచు) అబ్బ! కైకేయీ! ఆగుము. ఎప్పుడ గోపమేనా?

సుమి—(తనలో) బెదరింపులేగాని యెక్కడకుఁ బోవును?

కౌ—(కైకనుఁ బట్టుకొని) చెల్లెలా! పోకుము. దైవప్రసా

పదార్థమును నిరాకరించుటదోషము. అమ్మా! నీయిష్టమువచ్చినంత భాగమును నీవు తీసికొనుము. మిగిలినదే మేము భక్షింతుము.

కై—సన్నాహపకుము. అమ్మా! అంతయు మీరే తీసికొనుడు. నాకేమియునక్కఱలేదు. మీకుఁగలుగు పుత్రులు నాపుత్రులు కాక పోవుదురా?

సుమి—చెల్లెలా! నీకుఁగలుగు పుత్రులు మాకుమాత్రము పుత్రులుగాకపోవుదురా? నీకింతకోపమెందులకు? నీవొక్కతెవే భుజింపుము.

దశ—(చేయిపట్టుకొని) కైకా! పుత్రభిక్షకై నేనుదేవునెంత ప్రార్థించితినో పాయసముఁదిని పుత్రునిగనవలసినదని నిన్నంతకంటె నెక్కువగఁ బ్రార్థింపవలయునా?

సుమి—(తనలో) నాథా మీ కేలాగుననుదప్పదు. విశేషమేమున మేముగూడఁ బ్రార్థింపవలసివచ్చినది.

కైక—నాథా! పొడిపొడిమాటలచే సంతోషపెట్టఁ బ్రయత్నింపకుము. నేనెంత జేలమనసు గలదాననయినను నీవియన్నపై ప్రార్థనములు. లోనితూష్ణీంభావములు, పై కిచకిచలు, లోని ధుమధుమలు, పై మమకారములు లోని వెటకారములు, పైగోడు, లోనిసూడు, తెలియలేనంతమందబుద్ధినిగాను. పాయసమిచ్చుటలో నీకుఁబక్షపాతముదయించినది.

దశ—పక్షపాతముగగాక సరిగఁబంచియిచ్చెదను.

కైక—సెబాస్. సరిగనిచ్చెదవుకాదా? ఇమ్ము. వలదనినవారెవరు?

దశ—"సరిగ" ననఁగ నీయభిప్రాయమేమి?

కైక—ఇదిగో ఏ పెద్దల కధికభాగములనిచ్చి యధికులఁజేసి నన్నన్నివిధములఁ జిన్న సేయఁ దలఁచితివో యట్టి మాయక్కలకే యిదుగుము.

దశ—ఏమి? సుమిత్రా! నీయభిప్రాయమేమి?

సుమి—నేను పెద్దనుగాను; చిన్ననుగాను. నడిమిదానను. నన్ను డుగనేల?

దశ—సతులారా! మీలో మీరు నిష్కారణముగ వైరమొంద వలదు. నేను సరిగఁ బంచియిచ్చెదను.

కైక—"సరిగ" యనఁగ సమభాగములుగ ననిమీయభిప్రాయ మగునేనిఁ గానిండు.

దశ—సరిగ యనఁగ న్యాయముగ.

కైక—న్యాయమనఁగ నేమి? మీబుద్ధికి న్యాయమా? మా అక్కలబుద్ధికి న్యాయమా? నాబుద్ధికి న్యాయమా? దైవబుద్ధికి న్యాయమా? ఎవరుచెప్పిన న్యాయము? ఏటిన్యాయము? పాయస ప్రదాతయగు యజ్ఞదేవుఁడే పదార్థమును మామువ్వుర కొసఁగుమని నాఁడా? లేదా?

దశ—అట్లే సెలవిచ్చినాఁడు.

కైక—అంతేకాని బుద్ధిచేత నాలోచించి న్యాయమని తోఁచిన రీతిన్యాయము ననుసరించి కొందఱను సంతోషపెట్టి కొందఱ నేడ్పించి యిమ్మని యిన్నిమాటలు చెప్పినాఁడా? ఏమి? మాటలాడ రేమి?

దశ—అట్లు సెలవీయలేదు.

కైక—లేనియెడల నింత సందేహమేల? ఈ యోజనములేల? ఈ తొట్రుపాటేల? నానోరు కొట్టవేయనేల?! మీరన్న న్యాయము

న్యాయముకాదు. పెద్దభార్యకొక న్యాయము. మాయక్క చెప్పినట్లు నడిమిభార్యకొక న్యాయము చిన్నభార్యకొక న్యాయమునా ? దైవప్రసాదమున కందఱును సమానార్హులను లోకన్యాయము ననుసరించి పంచి పెట్టుము.

దశ — కైకా ! (బ్రాహ్మణుల కనేక పర్యాయములు నీవు దానదక్షిణాదుల నిప్పించితివికదా ! పెద్దలకు చిన్నల కొకరీతినే యిప్పించితివా ?

కైక — (బ్రాహ్మణులకిచ్చినది నాసొమ్ము. నాసొమ్మును నా యిష్టానుసారముగఁ బంచియిచ్చెదను. నాయనుగ్రహము ననుసరించి యిచ్చెదను. నీభండారములోని సర్వధనమును మాయక్కలకిచ్చిననైన నేను నోరెత్తుదునా ? నీవు నన్ను నిరాకరించి మాయక్కలతోడనే కాలక్షేపము చేసిననయిన నేను దైవమును దూఱుచు నీపాదములయొద్దఁ బడి యుండుదాననే కాని యిదియేమియని పలుకవలసినదాననా ?

సుమి — (తనలో) అబ్బా! ఏమిశాంత చిత్తత! ఏమిసహనశక్తి! అటులే నాథుఁడు చేసినయెడలయీసాకేతపురిని సమూలముగా సముద్రమున గలుపకమానుదువా ? కైకమ్మతల్లీ! నాథుఁడు నీయెడల నత్యనురాగుఁడై మాయెడల నొకరీతిగనున్నను మాకు నాథునికిఁ గూడఁ జీవాట్లుతప్పలేదయ్యెను.

కైక — నీయనుగ్రహమును గనఁబఱచుటకు నీయిష్టమునుఁ జూపుటకు నీన్యాయమును జరుపుటకు సంభావనకు వచ్చిన ముష్టిబాపనయ్యలకువలె మేము నీబంగారమపేక్షింపలేదే ? నీసుణులఁగోరలేదే ? నీవస్తువేదియును దేవ్వరింపలేదే?

దశ — ఈపరమాన్నము నావస్తువుకాదా?

కైక—ఎట్లు?

దశ—(నవ్వుచు) యజ్ఞపురుషుఁడు నాకొసఁగుటచే నాది.

కై—మిమ్ము దినుమని మీకిచ్చెనా?

దశ—(నవ్వుచు) నీవు నన్నిట్లు వేఁపుకొని తినుటకు నాకిచ్చినాఁడు. తెలిసినదా?

సుమి—(తనలో) మాతోపాటు.

కైక—నా స్వామి! ఎంతధర్మశీలుఁడవు! నావిమీఁదియను భేదమును జేయుచుంటివి. నీయర్ధశరీరిణులమే! నీసహధర్మచారిణులమే! పుత్త్రభిక్షఁగోరి మీతోపాటు యజ్ఞము మేముగూడ జేయలేదా? మీవలెనే యజ్ఞదీక్ష మేముగూడ నెఱపలేదా? మీవలెనే మేముగూడ యజ్ఞదేవుఁ బ్రార్థింపలేదా? అట్టియజ్ఞఫలమగు నీపవిత్రవస్తువు నీకొక్కని కీయఁబడినదా? అందుచేనిదా? అటుకాదు. అదిమాకొఱకు నీచేతికీయఁబడుటచే నీదికూడనయినది. కాని నీకీయఁబడుటచే నీదయి నీవుమాకిచ్చుటలేదు. మాకిచ్చినది యజ్ఞపురుషుఁడే, నీకున్న జ్యేష్ఠామధ్యమాకనిష్ఠాభేదమాయనకు—

దశ—సరే. ఆయనకు లేదు. మీకట్టిభేద మున్నదందువా? లేదందువా?

కైక—మీ ప్రశ్నము నాకు బాగుగఁ దెలియలేదు.

దశ—సుమిత్రా! నాయభిప్రాయమును నీచెల్లెలికిఁ జెప్పుము.

సుమి—చెల్లెలా! నీవందఱకంటెఁ జిన్నదానవనియు నీకంటె నేనుఁ బెద్దదాననవనియు నీమె సర్వజ్యేష్ఠురాలనియు భేదము మనలో నున్నదా లేదా యని యడుగుచున్నారు.

కైక—అట్లు వ్యత్యాసము లేకేమి?

భాగము నపేక్షింపఁజనదు. అపేక్షించిన లాభమును లేదు. కౌసల్య వయస్సుచే జ్యేష్ఠ్యతచేతఁ బెద్దది. చిరకాలము కాపురము చేసినది. పుత్త్రులు లేరని మీ యిరువురకంటె నెక్కువకాలము తపించినది. మీ యక్క యగుటచే మీకుఁ బూజ్యురాలు. అందుపై మీయందు నిరంతరానురాగము గలది. ఎన్నఁడును స్వలాభమును గోరుకొని యుండలేదు. అట్టి యీ కౌసల్యాదేవిని నేను మీకు తప్పక గౌరవింపఁదగినది. మనల లోకులు మెత్తురు. మనతరువాతివారు మనలఁగొనియాడుదురు. కైకా! మనసులో నేమియుంచుకొనకుము. పవిత్రమైన ముహూర్తము దాటిపోవుచున్నది. అట్లు తలవంచుకొనుట కాదు. నీచేయి నిటు దెమ్ము. కౌసల్య చేయి పట్టుకొనుము.

కైక — (అట్లు చేయును.)

కౌ — చెల్లెలా! నేను వయస్సుచేఁ బెద్దదాననయినను నీవే నాకంటెఁ బెద్దదానవుగ భావించి నన్ను గౌరవించుచున్న సంగతి నీ వెఱుఁగుదువుకదా! అట్టిచో ననవసరమగు నీగాథయేల? నీయిష్ట మెట్లో యట్లే కానిమ్ము.

కై — నేను దొందరపడి యేమియనిన నిన్ననిన యెడల క్షమింపుము. (కౌసల్యను కౌఁగిలించుకొనును.) అక్కా! సుమిత్రా! నిన్నుఁ గూడ నిట్లే కోరుచున్నాను.

దశ — సెబాస్! కైకా! నీకు కోపమెంత శీఘ్రముగఁ గల్గునో ప్రసన్నతకూడ నంత శీఘ్రముగ నేకలుగును. వెఱ్ఱికోపమెటులో వెఱ్ఱి నయయునటులే. ఈ పాయసకలశము నీచేతిలో నుంచుకొనుము. ఇదిగో పంచుచుంటిని. కౌసల్యా! నీకు దీనియందర్థభాగము.

కౌ — మహాప్రసాదము.

దశ — మిగిలిన యర్థభాగము రెండుభాగములు చేయుచున్నాను.

(చేసి) ఇదిగో! ఒకభాగము. సుమిత్రా! నీది. (సుమిత్రకిచ్చును)

సుమి — మహాప్రసాదము.

దశ — మిగిలిన భాగమును నీవు దీసికొందువా?

కైక — సుమిత్ర నాకంటె పెద్దదయినందుల కామెకు నాకంటె కొంత యధికభాగము కావలదా?

దశ — అట్లయిన నేమి సేయుచుంటివి?

కైక — నావంతు రెండు భాగములు చేసి యొక భాగము సుమిత్రకిమ్ము.

దశ — సెబాస్! కైకా! సుమిత్రా! నీవనినట్లు నీకు రెండు వంతులు వచ్చినవి. తీసికో. నీకిద్దఱు కొడుకులు గలుగుదురేమో?

సుమి — (తనలో) ఇట్టులు ప్రాప్తియయినన రే! అనేక శిరస్సులుగలవాడయినసరే. కొడుకు పుట్టినచాలు.

కైక — నేని యష్టమభాగమును దీసికొందును.

దశ — కైకా! నీవు సంతుష్టినొందితివా?

కై — ఆ.

దశ — ఉత్తర క్షణమునుండి మనకు ముచ్చటలపై ముచ్చటలు. వేడుకలపై వేడుకలు. పండుగలపై పండుగలు. ఇక్కడకు మాకున్న శాంతి పడినది. సతులారా! మీరింక భుజింపరేమి?

కౌ — ఇక్కడనేల? భోజనశాలలోనికిబోయి యక్కడ కలిసి భుజింతుము.

దశ — సరే. పోదము రండు.

(నిష్క్రమింతురు.)

శ్రీ

# కల్యాణ రాఘవము.

## ద్వితీయాంకము.

(ప్రదేశము—వీథి. ప్రవేశము—కావేరి, రుచిర.)

కావే—రుచిరా! వేగరా! అట్టు లడుగులో నడుగు పెట్టెద వేల?

రుచి—మాయమ్మ కైకమ్మకుఁ గడుపుచేత మందగమనము వచ్చియుండ నాకుఁ గాలిపైకురుపుచే వచ్చియున్నది.

కావే—ఇట్టిస్థితిలో నేల తిరుగుచున్నావు?

రుచి—కురుపుకంటె బొంగసాపు మెక్కువ సంబరపుచున్నదమ్మా.

కావే—మా కౌసల్యకుఁ గడుపు రాలేదా? సుమిత్రకుఁ గడుపు రాలేదా? కైకమ్మ వీరిద్దఱికంటె నెక్కువసుకుమారియా? తానంత "అస్సు ఉస్సు"ఁ బడుచున్నదఁటేమి?

రుచి—కావేరమ్మా! చెప్పితివమ్మ వేమోకాని చూడు! ఎవరి కోడలయినఁ దినుగ ననఁబోకుసుమా! నాతో చెప్పరి. ఇదిగో! ఆ పాయసముఁ దిన్న మరునాఁటినుండి యుదయమారంభము. ఒక్కటే వేవిళ్ళు! ఆకలి, విరామము లేదు. ఇటుగుటక. అటు "ఓక్కు" వెలుతుఱునంటఁ యెటుటను వీలు లేదుగదా! ఎవ్వరిని జూచిన నసహ్యతగదా! ఇదిగో

కావే — చదువుకొన్నవారు మీరెక్కడ గట్టుకొనినఁ గట్టు కొందురు; నాకెందులకవన్నా! నేను బోయెదను.

రుచి — వదినా! కోపమా! ఎచ్చటకుఁ బోదలఁచితివో చెప్పవా?

కావే — చెప్పుటకు రహస్యమేమున్నది? మాయమ్మ వసిష్ఠ భగవానుని యాశ్రమమునకుఁ బోయి వారచ్చటనున్నారేమో కనుగొనిరమ్మన్నది.

రుచి — ఏందులకో!

కావే — నాకుఁ దెలియలేదు.

రుచి — పురుడు శీఘ్రముగ రానై యున్నదని సందేహముచే గురువుగారింటనున్నారో లేరో కనుగొనుమన్నదేమో?

కావే — పురిటికిఁ గావలసినది మంత్రసానియా? మహర్షియా?

రుచి — అదేమిమాట! శిశుజన్మకాలనిర్ణయము మొదలగు పనులకు గురువుగా రుండవలదా? కాని మీయమ్మగారప్పుడేమి చేయుచున్నారు?

కావే — నేనిటు వచ్చుచుండఁగనే మా చెల్లెలిని బిలిచి "రాజుగారి నిటురమ్మని కోరితినని చెప్పుము." అని దానితోఁ జెప్పెను.

రుచి — సరి! ఇఁక నేమి, నేననినదే నిజము. ఈసరికి రాజుగారామెయొద్దకు వచ్చియుందురు. కావున నీవు వేగ పొమ్ము. నేనును బోయి యేదియో యొకపుల్లని వస్తువును దీసికొని పోయెదను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.



# ద్వితీయాంకము.

ప్రదేశము — కౌసల్యాంతఃపురము.

ప్రవేశము — దశరథుఁడు, కౌసల్య.

దశ — ఏం?

కౌస — వంగి మీపాదములను శిరమున పట్టుకొనుటకు నాకు మిగుల కష్టముగనున్నది. అందుచే దయచేసి మీపాదములను నా తొడలపైనుంచుఁడు. చేతులనెత్తి కన్నుల కద్దుకొందును.

దశ — ప్రాణప్రియా! నీవిప్పుడటులు చేయకున్ననేమి?

కౌస — నాథా! (గద్గదికతో) ఏమియు లేదు.

(కన్నుల నీరుంచుకొనును.)

దశ — ఆ! ఆ! అదేమి కౌసల్యా! ఎందులకు? (మొగము నెత్తి కౌఁగిలించుకొని) హా! ప్రాణప్రియా!

గీ. చెప్పవా! చెప్పవా! నీదు ♦ గొప్పకనుల
కొలుకులను వేడి కన్నీళు ♦ లొలుక నేల?
చెక్కు లెఱుపెక్కనేల? ♦ సీత్కృతులఁ బె
దవు లొదులనేల గుండెల ♦ దడయు నేల?

కౌస — (దైన్యముతో) నాథా! నాకేమియుం దోచుట లేదు. లోపలనేమియో యావేదనముగనున్నది. గర్భముననేదియో తళుక్కుమని ప్రవేశించినట్లున్నది. కనులు చీకటులు గ్రమ్మినవి. అమితముగ

గీ. యజ్ఞదేవ ప్రసాద మా ♦ హాత్మ్యమునను
జింతలఘుగంబైనంచు నెం ♦ చితినిగాని
సతులు గర్భధారణకళా ♦ వతులు గాఁగ
నిప్పుడొకనూత్నచింత వే ♦ ధించునన్ను.

సీ. అంతంత మొగములై ♦ యంతంత ఱొమ్ములై
యంతంత యుదరంబు ♦ లైన వింత
యాకారములతోడ ♦ నేను ముక్కులఁబోలె
పలుచపల్చని వెల ♦ వెలలతోడ
నిదుర మబ్బులతోడ ♦ నిట్టూర్పుబుసతోడ
నీరుపట్టినకాళ్ళ ♦ బూరతోడ
మెల మెల్లనెదురీఁత ♦ యలపులసొలపుతో
గాజుకాయలవలెఁ ♦ గానఁబడుచు
గుత్తుకత్తను నిల్లాండ్రి ♦ గోడుచూడ
గుండెలు పటాలుమనుచుండు ♦ రెండుతలలు
నెప్పుడేర్పడు నెప్పుడు ♦ గుప్పుచప్పు
ననుబయటఁబడువారమో ♦ యనెడుపగను.

గీ. ఏకసతియున్నవానికే ♦ యింతబాధ
యనఁగ ముగురున్ననా బ్రదు ♦ కడుగనేల?
ఉవిదలెందరున్నను సౌఖ్య ♦ మొకటెకాని
కుడుచు కష్టంబులెన్నియో ♦ నుడువనగునె?

గీ. ఇదియె తొలిచూలు వయసు గ ♦ తించువెనుక
రాకరాక యబ్రముగాఁగ ♦ బ్రాప్తమయ్యె
నేమగునోయంచుఁ గౌసల్య ♦ యిట్లువగచు
గోల! తెలుఁగదు; సుకుమారి ♦ కోమలాంగి.

గీ. యజ్ఞదేవ ప్రసాద మా ♦ హాత్మ్యమునను
జింతలనుగంటెనంచు నేం ♦ చితినిగాని
సతులు గర్భధారణకళా ♦ వతులు గాఁగ
నిప్పుడొకనూత్నచింత వే ♦ ధించుచున్న.

సీ. అంతంత మొగములై ♦ యంతంత ఱొమ్ములై
యంతంత యుదరంబు ♦ లైన వింత
యాకారములతోడ ♦ నేను ముక్కలఁబోలె
పలుచపల్చని వెల ♦ వెలలతోడ
నిదుర మబ్బులతోడ ♦ నిట్టూర్పుబుసతోడ
నీరుపట్టినకాళ్ళ ♦ బూరతోడ
మెలమెల్లనెదురీఁత ♦ యలపులసొలపుతో
గాజుకాయలవలెఁ ♦ గానఁబడుచు
గుత్తుకత్తను నిల్లాండ్రి ♦ గోడుచూడ
గుండెలు పటాలుమనుచుండు ♦ రెండుతలలు
నెప్పుడేర్పడు నెప్పుడు ♦ గుప్పుచప్పు
ననుబయటఁబడువారమో ♦ యనెడుపగను.

గీ. ఏకసతియున్నవానికే ♦ యింతబాధ
యనఁగ ముగురున్నవాఁబ్రదు ♦ కడుగనేల?
ఉవిదలెందరున్నను సౌఖ్య ♦ మొకటెకాని
కుడుచు కష్టంబులెన్నియో ♦ నుడువనగునె?

గీ. ఇదియె తొలిచూలు వయసు గ ♦ తించువెనుక
రాకరాక యబ్రముగాఁగ ♦ బ్రాప్తమయ్యె
నేమగునోయంచుఁ గౌసల్య ♦ యిట్లువగచు
గోల! తెలియఁదు; సుకుమారి ♦ కోమలాంగి.

నీవు రేపటివఱ కుండనక్కఱ లేదు. ఈదినముననే శుభప్రసవమగు చుండుగాక! నీదాసి మొవతెయయిన నక్కడనున్నదా?

కౌ—అందఱను బంపివయిచితిని. ఏల?

దశ—ఏలయందు వేల? పిలిపింపవలసినవారిఁ బిలిపించి, వల సిన సన్నాహమంతయుఁ జేయింపనక్కఱలేదా?

కౌ—తొందరపడకుఁడు. ఎవ్వరిని బిలిపింపవలదు. ఇఁక గొంత- సేపు మాత్రము.

దశ—ఇంకఁ జూచున దేమి. (గట్టిగ) కావేరీ!

(నేపథ్యమున) బాబూ! వచ్చుచున్నాను.

కౌస—దానితో నిందుకొఱకని చెప్పెదరాయేమి? వలదు.

దశ—దాసికయినఁ దెలియకుండ నెటులు?

కౌ—ఇప్పటినుండియునా? ఈదాసుల చెవినిఁబడిన ముక్క నీటిపైఁబడిన నూనెచుక్క.

దశ—అటులయిన యిప్పుడేమిచేయుమంటివి?

(నేపథ్యమున) అమ్మా! లోనికిరావచ్చునా?

కౌస—కావేరీ! రావచ్చునుకాని నీవిచ్చటకువచ్చి చేయున దేదియులేదు. జపమగునెడలఁ బూజ్యురాలగు నరుంధతీదేవిగారిట కొకసారి దయసేయుదురేమో కనుఁగొనెదవా?

దశ—(నిమ్మళముగ) జపము వదలియయిన శీఘ్రముగ నని చెప్పరాదా?

(నేపథ్యమున) అమ్మా! పోయి చెప్పెదను.

కౌ—సరే.

దశ—వసిష్ఠభగవానునకెప్పుడు వార్త నంపుదము.

కౌస—ఆమె పెద్దది. మిగులఁ దెలిసినది. వచ్చినతరువాతనన్ని యేర్పాటులును సందడిలేకుండ నామెయే చేయును.

దశ—సంతోషమే. నీకింక భయమేమియు లేదుకద.

కౌస—లేకేమి! ఇప్పుడంత బాధ లేకుంట చేస్థిమితతగనున్నాను ఇదియంతయుఁ గడచి గట్టెక్కి తిరుగమీతో సుఖింపఁగలనా?

(నేపథ్యమున) ఆ! ఆ!

దశ—ఆహా! వింటివా? ఎట్టి సదుపశుశ్రీయయినదో.

కౌ—కావేరీ! ఆ. ఆ. యనుచున్నావేమి?

(నేపథ్యమున) దేవిగారు మహారాజుగారియొద్దనేయున్నారా? యని రెండవరాణిగారిదాసిగంగచేసిన ప్రశ్నమునకు ఆ. ఆ. యనుచున్నాను.

కౌ—భగవతియగు నామెంతో మనవిఁజేసితివా?

(నేపథ్యమున) ఆ, వచ్చెదననినారు.

కౌ—తొందరగ దయసేయుమని చెప్పలేదుకద.

(నేపథ్యమున) ఉ. హు.

కౌ—సరే. పొమ్ము. నాథా! నాచెల్లెలు సుమిత్ర నన్నుఁజూచుటకయి రాఁదలచి దాసిచేవార్తనంపియున్నదికాఁబోలు. నేను సెలవు తీసికొనివెళ్ళనా?

దశ—నీవు వెళ్లుటయేల? ఆమెయే యిక్కడికు రాఁగూడదా?

కౌ—సరి.సరి. చాలులెండు. నాథా! నేనొకరహస్యపుమాట నడిగెదను. చెప్పెదరా?

దశ—తెలిసినయెడల.

కౌ—సుమిత్రగర్భము కైకమ్మ నాగర్భములవలె లేదేమి?

దశ—లేక ?

కా—మిగులఁ బెద్దదిగా నుంటయే కాక యాకృతిచేఁ గూడ వింతగ నున్నది. ఈపక్కను బెరిగియున్నది. ఆపక్కను బెరిగియున్నది. బొంతయరఁటిపండువలె నడుమ గొంచెము వెలితిగ నున్నది. ఎందుచేత?

దశ—ఆమె కవలపిల్లలను గాంచుననితోఁచుచున్నది.

కౌస—అమ్మయ్యో! ఇద్దఱుపిల్లలే. నాకొడలు జలదరించుచున్నది. ఏమండి నేనడిగిన ప్రశ్నమునకుత్తరము చెప్పకపోయితిరి ?

దశ—ఊఁ శ్రుతియే చెప్పినది.

గీ. నీదు నునులోముతలగడ ♦ మీఁదఁదలయు
నాదు నెదపైనఁ గాళ్ళుంచి ♦ నీదు సుతుఁడు
పండి యెడనెడఁ గుయికుయుం ♦ చుండఁ గలసి
యతని జోకొట్టుచును సుఖ ♦ మందగలము.

అంతకంటె మనకికేఁ గావలసినదేమి ?

కౌ—అంతవారమగు నెడల నికేఁ గావలసినదేమి? నాకుఁ గొంచెము కష్టముగనున్నది. నేనింకఁ బోవుదును. (పోఁబోవుచు) వైకుంఠవాసా! నాహృదయముననుండుము. గురు వసిష్ఠ భగవానుఁడా! నమస్కారము.

(కన్నులనీరు పెట్టుకొని) ప్రాణనాథా! నమ—స్కా—

దశ—ప్రాణకాంతా! వలదు. నీవు నమస్కరింపఁదగదు. నేనే నీకు నమస్కరింతును. (తనలో)

గీ. కష్టములకోర్చి మృతికిజం ♦ కక యపార
సర్వసృష్టి మహాతంత్ర ♦ సారసరణి
నున్నతన బొజ్జ నిముడుచు ♦ కొన్న గర్భ
వతియె ప్రత్యక్షపరమదై ♦ వంబుగాదె?

శ్రీ శేషశయన పరబ్రహ్మణేనమః (నమస్కరించును.)

కౌ—(మోమెత్తి తేరిపారఁ జూచును.)

దశ—సతీ! అట్లు నిశ్చలముగఁ జూచెదవేల?

(తనలో)గీ. కసరినను దీండ్రపడినను ♦ కైకయాజ్ఞ
భీతిమన్నించి తనమాట ♦ వినకయుండి
నను జలుపచూపు వలపుల ♦ నవ్వుపూలఁ
జల్లు నీమె జ్వాలలవెదఁ ♦ జల్లునేల?

(చేయిఁ బట్టుకొని) కౌసల్యా! మాటలాడవేమి? ఇట్లు రోజెదవేల!

కౌ—(దశరథుని ద్రోసివయిచి) ధనుస్సు! ఏదీధనుస్సు—
హా! హా! హా!

(చేయి విదల్చుకొని అట్టహాసముచేయును.)

దశ—హాహాహా! ఇదియేమి?

గీ. మోవికెలఁకుల దాటిపైఁ ♦ బోనిచిన్న
మొలకనవ్వుల నను, కతి ♦ గొలుకులెడలి
పోని చూపులముగ్ధ ని ♦ ప్పులను గురిసి
యట్టహాసముసేయు, వీ ♦ రాగ్రణివలె,

గీ. అంగుళుల యుంగరములెబ ♦ ర్వించునోలు ము
నబల, యిల్లాలు, చూలింత ♦ రాలు, నన్ను
భీకరాసురహారుని ను ♦ వ్వెత్తుగాఁగ
గోటికొన వీఁకె నిదియేటి ♦ పాటవంబొ!

గీ. వీణయో! కేళికాబ్జమో? ♦ ప్రాణనాథు
పాదయుగ్మకమో! చిత్ర ♦ ఫలకమొక్క
యాపుదానికి ధనుసేల! ♦ యకటకట!
ఇంతికింతలో మతి చలి ♦ యింపఁగలదె?

ఇది నమ్మజాలని (పరపరాసూచకములగు తొట్రుపాటు కాదు. ఏదయిన భూత మావేశించి యుండవలయును, లేదా పెద్దలో పేరటాండ్రో (మొక్కు కొందును. ఏదయిన మీఁదుఁ గట్టవలసినయెడలఁగట్టుకొందును. శిశువున కెవరిపేరు పెట్టుకొనుమన్న వారిపేరు పెట్టుకొందును. ఓకుల దేవతలారా! ఓపితృదేవతలారా! మీయారాధనమున నేమయిన కొఱఁతగావించియుండినయెడల నన్నుక్షమింపుఁడు. మీకోరిక లేవో దయచేసి స్వప్నరూపమున వెల్లడింపుఁడు. అంతేకాని

గీ. అరుపదగువేలయేండ్లు • మొఱఁడుగాఁగ
నున్నకట్టె మాధవుకృపఁ • జిన్నిచిగురు
పెట్టనున్నది, తతదయా • వృష్టిఁ జిలికి
పెంచుకొనుఁడు, మీయదిమీరు • పెరుకఁదగునె?

(ప్రకాశముగా) కౌసల్యా! (దరిఁజేరఁబోయి) ఆహా! తిరుగఁ ద్రోచి వచ్చిన నెక్కడఁ బడిపోదునో?

గీ. అసురరణరంగములను బా • కారి వెన్నొ
సంగుపట్టుల ప్రబలర • క్షఃపిశాచ
ఖండనోద్దండతాభి ము • ఖ్యంబుగాంచు
నేను సతిఁ జూడఁ జాలమో • మెత్తు యహాహ!

ఆహా! నాసతియేమి దివ్యదర్శనమిచ్చుచున్నది!

గీ. పరమగుచు, నగాధమగుచు • పరిపిమలంబు
నగుచు, దుర్నిరీక్ష్యమగుచు • నమితమగుచు
వర్ణనాతీతమగుచు ను • గ్భరమునగుచు,
నొకమహాతేజముఁట గాత్రిలు • చున్నదహాహ!

కావేరీ! కావేరీ!

(నేపథ్యమున) బాబూ!

దశ—వసిష్ఠ భగవానుని శీఘ్రముగ దయ సేయుండని చెప్పి వెంటఁబెట్టుకొనిరా! వెళ్ళితివా?

(నేపథ్యమున) ఆ!

దశ—నాకు మతి లేదు. చైతన్యమే లేనట్లున్నది. వైకుంఠ నిలయా! పన్నగశయనా! నాతండ్రీ! ఏమియీమాయ! ఏమియుఁ దోచకున్నది. ఎవరిదోకాలిచప్పుడగుచున్నది. గురువులవారువిచ్చేయు చున్నారుకాఁబోలు. (కొంచెము యెదురుగఁబోయి) మహాత్మా! దయ సేయుఁడు.

[వశిష్ఠుఁడు ప్రవేశించును.]

దశ—మహానుభావా! నమస్కారము. మహాసముద్రమున బడియున్నాను. కౌసల్యవంకఁజూడుఁడు. అదేమి?

వసి—(నవ్వుచు) మహాసముద్రమున నీవుబడియుండుట కాదు. మహాసముద్రమున బడియున్నయాతఁడు మనయింటికింక విచ్చేయును. ఈదినమే సుదినము నీబ్రదుకంతయునిందుకొఱకే! నాజప మంతయు నిందుకొఱకే!

దశ—మహాత్మా! కౌసల్యకేమియు నాపత్తు లేదుకదా?

వసి—(నవ్వుచు) దేవతలయాపత్తులింక నణఁగిపోవును. ఋషుల యాపత్తులింకదీఱును. లోకములయాపదలు మాయమగును.

కౌ—(పీఠమునుండి దుమికి) రే! సకలసురనికరసుఖరమా సమారంభ విమర్దనా! రే! సకలపవిత్రమహర్షిజాల జపతపోభంగ సమాచరణ సాహితీసనాథా! సాధుసాధ్వీయూథ బాధాచరణ వినద్ధా! సత్యదయాశౌచ ధర్మశూన్యా! మహామాయావీ! రే! లోకకంటకా! రాక్షసాపశదా! కుంభకర్ణాగ్రజా! రావణాధమా! కాచికో! నీమరణమింక నిశ్చయము! పుత్త్రపౌత్త్రికళత్త్రబంధుమిత్త్ర

పరివారసహితముగ నీచావు సమీపించినది. ధనుస్సేది! తమ్ముఁడా! ధనుస్సు—

వసి—సెబాస్! వినఁదగినమాటలువినఁబడినవి. ఈకర్ణములు పవిత్రములయినవి.

దశ—మహర్షి చంద్రమా! ఇదియేమిటి? అయ్యయో! ఆ పీఠము పైనుండి క్రిందకు దుమికెను. గర్భమేమగునో? గుండెలదటి పోవునట్లే మాటలేమిటి?

వసి—రాజచంద్రమా! ఏమియుఁ జెడియకము. ఒక గడియలో నింక భగవంతుఁ డవతరింపఁగలఁడు. ఆతనిముందు చర్యయే యిప్పుడు వెల్లడింపఁబడినది. అదృష్టవంతులలో నగ్రగణ్యుఁడవునీవే! నింద్యమగు పురోహితవృత్తి నవలంబించి నీయింటనింతకాలమునుండి పడికాపులుపడుచు నేనుండుట యీమహాసుదినముకొఱకే.

దశ—తానేయింకఁ బుట్టలేదుకదా! తమ్ముఁడా! ధనుస్సేదీ యనుచున్నాఁడేమి? రావణు నీతఁడు వధియించునా?

కౌ—(పండ్లుకొఱుకుచు,గట్టిగ) వధియింపక—ఇంకను పేఁడియా! ధనుస్సు. ధనుస్సు. హా! హా! హా!

(విఱుచుకొని క్రిందఁబడును.)

దశ—అయ్యో! అయ్యో! (కౌసల్యనుబట్టుకొని) కౌసల్యా! కౌసల్యా! మహర్షిచంద్రమా! ఇదియేమి?

వసి—మరేమియు జెడువకుము. గర్భముననున్న మహాతేజమామె భరియింపలేక పోవుటచేనట్లయినది. తొందరలేదు.

దశ—కౌసల్యా! కౌసల్యా! ఇంకనుస్మృతిరాలేదు. గురూత్తమా! ఏమిగతి?

వసి——నాకమండలూదకము నీమొహైపై కొంతచల్లెదను. (అట్లు చేసి) కౌసల్యా!

(కౌసల్య లేచును.)

(కౌసల్య అటునిటు తొట్రుపాటుతోఁజూచి)

దశ——ప్రాణకాంతా! నీకిపుడెట్లున్నది? ఇదిగో అటుచూడుము. వారెవ్వరు?

కౌస——గురూత్తమా! నమస్కారము. నాథా! అట్లుడిగెద రేమి?

వసి——(అపవారించి) రాజోత్తమా! ఆమెకిప్పటివృత్తాంతము తెలియనీయక పోవుటమంచిది. వెంటనే సూతికాగృహమున కామెను బంపుము.

దశ——కావేరీ!

(నేపథ్యమున) బాబూ! వచ్చుచున్నాను.

వసి——రాజా! నీవుకూడ లోనికిఁబోయి తద్గృహసమీపమున నుండి శీఘ్రోదయమగు వెంటనే యొకగంట వాయింపఁబంపుము. నే నిచ్చటనేయుందును.

దశ——తామొక్కరే యిక్కడ దయచేసియుందురా?

వసి——నాశిష్యునిరమ్మని చెప్పివచ్చితిని.

దశ——కావేరీ! ఇంకరావేమి?

(నేపథ్యమున) అరుంధతమ్మగారువచ్చినారు. ఆమెకుఁబూజా మందిరములోనికిఁ దారిచూపుచున్నాను.

దశ——సంతోషమే! నీవిక్కడకు రానక్కఱలేదు. నేను కౌసల్యనటకుఁ దీసికొని వచ్చెదను. మహానుభావా! సెలవా?

వసి—మంచిది.

దశ—(కౌసల్యను బట్టుకొని) దేవీ ! నీగర్భమున కెక్కడను దెబ్బతగిలినట్లు లేదుకద. అంతయు సరిగనున్నదికద ?

కౌస—(అపవారించి) ఏమియు లేదు. ప్రాణప్రియా ! నీకు మహాతేజస్సంపన్నుఁడగు పుత్త్రుఁడు కలుగునని గురువుగారు మంగళాశాసన మొనర్చిరిసుమా !

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

వసి—రెండుయామముల వేళకావచ్చినది.

గీ. తనకులంబునఁ దనకంటె ♦ ఘనసమగ్ర
విమల తేజోవిరాజిత ♦ విగ్రహంబు
పుట్టివంశంబునకు వన్నెఁ ♦ బెట్టుననుచుఁ
బట్టబంధుఁడు నమునింగిఁ ♦ బ్రబలియుండు.

శిష్యుఁడు—(ప్రవేశించి) ఇదుగో శిష్యుఁడు. గురువుగారు నాకొఱకు పైకిఁ జూచుచున్నారేమి ?

వసి—ఓరీ, శుంఠా ! నీవు వచ్చితివేల ? వాఁడేఁడీ ?

శిష్యు—నేను మాత్రము శిష్యుఁడనుగానా ?

వసి—సరే. కూరుచుండుము. ఈదిన మేతిథియో యెఱుఁగుదువా ?

శిష్యు—ఏదయిన గొంచెమాధారమున్నగాని చెప్పలేను.

వసి—ఏయాధారము ?

శిష్యు—ఈసంవత్సరము పంచాంగముచేయుటకుఁ గ్రిందటిసంవత్సరపుఁ గణితముకొంత యావశ్యకమగునట్లేనాఁటితిథి తెలిసికొనుటకు నిన్నటితిథి తెలియుటఁ గొంతయావశ్యకము.

వసి—నీకింకం జదువు రాదు. నీకు నావలన నేమియు నుపయోగించునట్లు తోంచదు.

శిష్యు—ఆసంగతి నేనెఱుంగక పోలేదు.

వసి—అటులయిన మఱియెక్కడికయినం బొమ్ము.

శిష్యు—అన్ని స్థలములు చూడనిదే యిక్కడకు రాలేదండి. నాపూర్వగురువులందఱు తమరు గట్టివారని చెప్పిరి. నాదురదృష్టమున నన్యథాయయ్యెను. నేనునింకం జదువుమాని వైచి తపమో, కవిత్వమో మొదలు పెట్టవలయునని యేచూచుచున్నాను. కాని యీమహారాజుగారి పుత్రోత్సవాదులలో నేమయినలాభించునేమోయనియాస బెట్టుకొనియున్నాను. రాజభార్యలకుం దొమ్మిది దాంటినది. పదిపదునొకండు దాంటినది. పండ్రెండవమాసము నడుచుచున్నదని తెలియుచున్నది. మూడు తొమ్మిదులు కాంబోలును. అందుచే నింతట దేలునట్లు తోంచదు.

వసి—అక్కర లేదు. కౌసల్యాదేవి గర్భమున మహాతేజశ్శాలియగు పుత్త్రుండిం కపావుగడియలో జన్మింపనై యున్నాండు. శుద్ధనవమి. పునర్వసూనక్షత్రము. అన్నియు బాగుగనున్నవి.

శిష్యు—నవమినింగూర్చి నాకుం గొంచెము సందేహముగనున్నది.

వసి—ఎందుచేత?

శిష్యు—జన్మమనంగా నింటిలోం బ్రవేశము కాదా? ప్రవేశ నవమి నిషేధముగదా?

వసి—నీమొగము! ఆమహాతేజ మిదివఱకే దేవీగర్భమునం బ్రవేశించినది. ఇప్పుడు ప్రత్యక్షమగుటయే జరుగనై యున్నది.

శిష్య—ప్రత్యక్షనవమిమాత్రము నిషేధముకాదా?

(లోనగంటవినఁబడుచున్నది.)

శిష్య—అద్దీ! సత్యము, నేను జెప్పినమాట సత్యము.

వసి—ఆగంట నీకుపశ్రుతి కాదు. అది శీర్షోదయమగువెంటనే వాయించినగంట. దీనినిఁబట్టి తరువాత జాతకచక్రము వేయుదును.

శిష్య—శీర్షోదయసమయము మనకుఁ బ్రధానము కాదు. మూఁడు దినములక్రింద శీర్షోదయము కాసిండు. అది మనకు లెక్క కాదు. భూపతన సమయమే ముఖ్యము.

(నేపథ్యమున) ఫిరంగులధ్వనియు ఢంకాభేరీవాద్యములధ్వనులు వినఁబడును.)

వసి—ఆహా! మంగళవాద్యములు వినఁబడుచున్నవి. భగవానుఁడవతరించినాఁడు. లోకమునకెట్టి శుభదినము సిద్ధించినది?

గీ. చైత్రమందునశుద్ధ ప ♦ క్షముననవమి
తిథిఁ బునర్వసూ తారను ♦ విధుగురుయుత
గర్కటక శుభోదర్క ల ♦ గ్నమునను బుధ
వారమునను శ్రీహరి యను ♦ తారమందె.

(నేపథ్యమున) జనులారా! సందడిసేయవలదు. మీకందఱకు సంతుష్టికరముగఁ బంచిపెట్టించెదను.

శిష్య—సుమంత్రుఁడు సేవకులచే ఖండశర్కరజనులకుఁబంచి పెట్టించుచున్నాఁడు. నేనుగూడఁ బోయి తెచ్చికొందునా?

వసి—పో—

శిష్య—(పోవును)

(నేపథ్యమున) సుమంత్రుఁడా! యథేష్టముగ నిష్కములఁ

బంది పెట్టింపుము.

వసి—రాజేంద్రుఁడదిగో! యిటకు వచ్చుచున్నాఁడు.

దశ—(ప్రవేశించి) నమస్కారము.

గీ. అంధునకు నేత్రసంపత్తి ♦ యమరెఁ బుల్ల
పిచ్చిగి మోడైన చెట్టు పు ♦ ష్పించెఁ గడుపు
కఱవగు దరిద్రునకు ♦ రత్నఖనిలభించె
దాసునకుదొడ్డగతిగల్గె ♦ దాపసేంద్ర.

వసి—దాసునకేగాదు దేశమునకంతకని చెప్పుము.

దశ—బాలుఁడు బహుతేజస్వియైయున్నాఁడఁట.

వసి—నీవింకఁ జూడలేదా!

దశ—నాకు దైవసములగు మీరుచూడకుండ నేజూచెదనా? వత్సకు శుభస్నానమయినది. నేను గూడస్నానమొనర్చి పరిశుద్ధుఁడనయియున్నాను.

వసి—జాతకర్మాదికృత్యములింక నిర్వర్తింపవలసి యున్నవి.

దశ—కావేరీ! బాలునిట్లు తీసికొనిరమ్ము మహర్షిసత్తములకుఁ జూపింతును.

(కావేరి పొత్తులలోనుంచి వత్సను దెచ్చును)

దశ—పిల్లవానిని ముందు గురువుగారికిఁ గానఁబఱుపుము.

వసి—రాజేంద్రా! నీవుకూడ జూడుము.

దశ—(చూచుచు) ఎట్టులున్నాఁడు?

వసి—ఇదికన్ను. ఇదిముక్కు. ఇది చెవియని నాకేమియువిస్పష్టముగఁ గానఁబడుటలేదు.

గీ. కనులు మిఱుమిట్లుగొల్పి పు ♦ ల్కలనొసంగి
మోదబాష్పములను వెల్చు ♦ పూర్ణ విమల
శాంతగంభీరతేజంబు ♦ స్వల్పపూర్వ
పరిచయముగల యదియె చూ ♦ పట్టెనాకు.

దశ—గురువర్యా ! అదియేమి? ఇంతపిల్లవాఁడువిస్పష్టముగఁ గానరాఁడనుచున్నారేమి ?

ఆ. వె. అరగమూయునపుడె ♦ యంతంతలోకనుల్
విప్పినప్పుడెంత ♦ గొప్పలగునొ ?
మూటగాఁగ బాదు ♦ బుడుతఁడింతగనుండ
సాగియుండ నెంత ♦ సొగయగునొ ?

గీ. మెఱుఁగుఁ జామనచాయల ♦ హారఁగుతోడ
డంబుమీరెడు గుండ్రని ♦ గడ్డంబుతోడ
ముద్దులనుమూటగట్టు నె ♦ మ్మొగముతోడ
నితఁడు నయనాభిరాముఁడై ; ♦ యెసఁగునాకు.

గురువర్యా! ఈతనికేమిపేరు పెట్టినబాగుగనుండునో తెలిపెదరా ?

వసి—నీవు సూచించుచునేయుంటివికాదా ? ఈతఁడు సర్వ జన నయనాభిరాముఁడు. కావున రాముఁడని పేరుపెట్టుము.

దశ—తగినపేరు సెలవిచ్చితిరి.

వసి—ఈతఁడు ముందుచేయు లోకోపకారక కృత్యములను బట్టి యాపేరింతకంటెఁ దగియుండఁదలఁచియున్నది.

దశ—అంతయు దమ యనుగ్రహము. సుమిత్రియుఁగైకయు బాలునిఁజూచిరా ?

కావే—సుమిత్రమ్మగారు చూచినారు. కైకమ్మగారుచూడ లేదు.

దశ—ఎందుచేత ?

కావే—ఆమె బద్ధకముగా నున్నారు.

వసి—రేపటిదినమున నీసరికి రెండవపుత్త్రినేత్త్రకొనియుందువు జాతకర్మమును లాలసింపఁదగదు. లోనికి విఁారు పొందు. నేను స్నాను మొనర్చివచ్చెదను.

దశ—చిత్తము !

(అందఱు నిష్క్రమింతురు)





శ్రీ

# కల్యాణరాఘవము.

## తృతీయాంకము.

ప్రదేశము—సరయూనదిరొడ్డు.

ప్రవేశము—విశ్వామిత్ర శిష్యుఁడు నారాయణుఁడు;

వసిష్ఠ శిష్యుఁడగు శంకరుఁడు.

శంక—నారాయణుఁడా ! మనముగలసియెంతకాలమైనదో?

నారా—శంకరా ! శ్రీరామ జన్మోత్సవములకు మహారాజాహూతులగుమావిశ్వామిత్రగురువుగారితో నేనిటకువచ్చినప్పుడునిన్నుఁ గలసితిని.

శంక—ఎన్ని వత్సరములైనదో — ఇరువది వత్సరములై యుండునా ?

నారా—అబ్బే ! పదుమూఁడు వెడలి పదునాలుగు జరుగు చున్నదో—పదునాలుగు వెడలి పదునయిదు జరుగుచున్నదో?

శంక—ఇంతే—కాలము నాచదువువలె నింత మెల్లఁగ నడచు చున్నదే.

నా రా —

గీ. బాలుకంటెఁ గాలంబుత్రోఁ ♦ బేలువలెను
ప్రాఁకు ఘనతయందలి యాస ♦ బాలుఁడుంట;
వృద్ధుకంటెఁ గాలంబు ప ♦ ర్వెత్తులేఁడి
రీతిఁ జావునందలి భీతి ♦ వృద్ధుఁడుంట.

శంక — నీవనుమాటలెంత నిజములాగున నేయున్నది. మా గురువుగారయిన వసిష్ఠుని రాముఁడు జన్మించి యెంతకాల మయినదని యడుగ "నేఁడే! మొన్న మొన్న నే కాదఁటరా!" యని యాతఁడ నెను.

నా రా — కానియప్పటియుత్సవములుబహుదివ్యముగ జరిగినవి.

శంక — దైవవశముచే రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల జన్మోత్సవము లొక్క సమయముననే వచ్చినవికావున నంత వేడుకగ జరిగెను. దేనిమట్టునకదివేఱుగ జరిగియుండునెడల నీవేడుక జరిగియుండునా?

నా రా — వీరిలో భరతలక్ష్మణులిద్దఱు కవలలా!

శంక — తెలివితేటలలో మనమిద్దఱము కవలలవలెనున్నాము. లక్ష్మణశత్రుఘ్నులిద్దఱు సుమిత్రాపుత్త్రిలు — కవలలు. కైకేయీ పుత్త్రుఁడు భరతుఁడు.

నా రా — అలాగా! ఆదినములలో మీగురువుగారి యొద్ద నేదియో చదువుచుంటివికాదా?

శంక — ఇప్పటికి నక్కడనే సరిగ నదియే యేడ్చుచున్నాను.

నా రా — అంత విసుఁగుదలతోఁ జెప్పెదవేమి? చదువువచ్చు నంట లేదా?

శంక — ఉపనయనములగువెంటనే రాజపుత్త్రులను నల్వురను

మాగురువుగారికి విద్యాభ్యాసార్థమై రాజుగారొప్పగించిరి. అప్పటికి నేనొక యర్థప్రహరమునుండి జందెము మడతవైచి రువ్వలు వేయుచున్నాను. వారు నాక్రింది తరగతిలో నొకవారముండిరి. తరువాత నొకమధ్యాహ్నము సహపాఠకులుగ నుండిరి. ఇప్పుడు నాకు గురువులుగ నుండిరి. వారికి నాలుగు వేదములు వచ్చినవి. ధనుర్వేదము వచ్చినది. ఉపనిషద్విద్య వచ్చినది. వేయేల? అఱువదినాల్గువిద్యలును వచ్చినవి.

నారా—నీకేమివచ్చినవి?

శంక—నెత్తికిc జేతులు—కంటికి నీళ్ళు—ఒడలికిc బేపబెత్తపుc దెబ్బలు.

నారా—రాకపోయినప్పుడింతకాలము కష్టపడి చదువనేల?

శంక—వచ్చుచున్నది కావున నే చదువుచుంటిని.

నారా—వచ్చుచున్న దేమి?

శంక—కోటలో సంభావన—ఊరిలో దొడ్డిదక్షిణ.

నారా—"నీకుc జదువు రాదు—నీవుపో" యనిగురువుగారెప్పుడు విన్నను లేదా?

శంక—అనేకపర్యాయములు.

నారా—అట్లయిన నాయన నిన్నేల వదలుకొనలేదు?

శంక—విన్నట్లుకుట్టుటలోను వీపు గోకుటలోను విశేషవిద్వాంసుడ నగుటచే విడువలేకుండ నున్నారు కాంబోలు. కాని యిప్పుడేమియు నుత్సవములు లేవుకదా! మీగురువుగారేలవచ్చిరి?

నారా—ఆదినాళ్ళు తెలియcగలదు?

శంక—పోనీ—నీవిట్లు వీథివెంట నేలతిరుగుచున్నావో యడిగియును దెలియునా?

